శ్రీ

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజల్లా, పల్నాడుతాలూకా, జానపాడు

సంపుటము 7 } 1915 సెప్టెంబరు { సంచిక ౪

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry

# ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 శ్రీ రాజానారయణప్పారావు సింహాద్రప్పారావు బహదరు జమీందారులు నూజవీడు.

2 రాజా వెంకటాద్రిఅప్పారావు బహదరు జమీందారుగారు, నూజవీడు

3 రాజా వాశిరెడ్డి చంద్రిమౌళీశ్వరప్రసాదు బహదరు మన్నెసుల్తాన్ జమీందారుగారు ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామలింగుగారు నెల్లుట్ల షాపురవు సంస్థానముమేనేజరు నెల్లుట్ల

6 రంగావఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు మక్తాదారు చొల్లేరు

8 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

## సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి

3 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి

4 హనుమంత రెడ్డిగారు-క్షీరసాగరము

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి

6 అన్నమురాజు సుబ్బారావుగారునండూరు

7 నండూరు లక్ష్మీనరసింహారావుగారు, కరణం, నండూరు

8 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి

9 మెదకు శేషారావు దేశముఖుగారు నల్లబల్లి

10 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాడవరము

11 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు

12 హెజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ

13 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద

# అభినవసరస్వతి.

సంపుటం. 7. } జానపాడు రాక్షస సం॥ భాద్రపదమాసము { సంచిక 9.

## మతములు-మతగురువులు.

క్రైస్తవమహమ్మదీయాది బహుకాలసముద్భూత దేశాంతరమతములసంగతి యటులుండ నార్యమతము బ్రహ్మసమాజము మున్నగు మఱికొన్ని క్రొత్తమతములు ముఖ్యవర్ణములలోనే ప్రబలి నిమ్నజాత్యుద్ధారకులు పాశ్చాత్యవేషభాషావలంబులు సంఘసంస్కారులు మున్నగువారితో హిందూదేశమంతయుఁ బరివ్యాప్తమై సనాతనధర్మాభిమానులకుఁ జాలఁ గష్టముగలిగించుచున్నయది- పూర్వోక్తులకు సదాచారమన్నను దదనుష్ఠానమన్నను దత్ప్రవర్తకులన్నను ననిష్టము- అందువలననే యిచ్చవచ్చినట్లుచ్చరింపరానిదూషణలచేఁ బైవారికిఁ బరితాపముం గలిగించుచున్నవారు- తాముమతాంతరులగుట హైందవధర్మపరిపాలనము నుపేక్షవహించియున్న పాశ్చాత్యులచేఁ బరిపాల్యమానులముగుమన మీవిషయమును జక్కఁజేసికొనుట దుష్కరమే కాని యితరుల ప్రవర్తన మాపఁజాలకున్నను దద్బోధలచే మనమును నేతత్పథమునఁ బ్రవేశింపకుండ మాత్రము కాపాడుకొనవలె. ప్రకృతమునవలెనే పూర్వమొకప్పుడు బౌద్ధచార్వాకాది దుర్మతశతభూయిష్ఠమై యజ్ఞయాగాదికర్మలకు నిసుమంతయు నవకాశములేక యార్యావర్తమంతయు నల్లకల్లోలమైయుండ నీశ్వరాంశచే శ్రీశంకరభగవత్పాదు లవతరించి నిజవిద్యాతపోమాహాత్మ్యమువలనను రాజసాహాయ్యము వలనను దద్దుర్మతములనన్నింటిని నిర్మూలముంజేసి షణ్మతాత్మకముగు శుద్ధాద్వైతముఁ స్థాపించి తన్మతప్రచారమునకై తత్తత్స్థలముల నాచార్యపీఠములఁ నెలకొల్పిరి. తదాది యిప్పటివఱకు తచ్ఛిష్యపరంపర వచ్చుచున్నయది- అందుఁ బుష్పగిరిపీఠ మొకటి- అయ్యాది చెన్నపట్టణము మొదలు మచిలీపట్టణమువఱకుకల మధ్యదేశమంతటికిని వర్ణాశ్రమధర్మవ్యవస్థాపనయం దధికారముగలిగియున్నయది- శంకరేచ్ఛ యప్రతిహతమగుటఁ దుదకుభవితవ్యమే ఫలవంతమగు మున్నను మధ్యమధ్య నేనుబైని జెప్పినహేతువులచేఁ గొన్నికలవరములుమాత్రము కలుగక తప్పచున్నవి కావు- నెల్లూరునివాసియగు ముత్తరాజు వెంకటకృష్ణయ్యయను నొకరు కర్నూలులో నుద్యోగవశమునుండుచు విధవయగుతమకుమారిక కుద్వాహముం గావించుటయుఁ దత్రత్యు లాగ్రహస్థునిఁ బంక్తిబాహ్యుంజేసిరి- తదుద్ధరణేచ్ఛమైఁ గావలిసంఘసంస్కారు లాయనంబిలిపించి సపంక్తిభోజనాదికమాచరించుచు నాయూరిపూర్వాచారపరాయణులు శ్రీపుష్పగిరిస్వాములవారికీసంగతివిన్నవించి సంస్కర్తలకందఱకు నోటీసులం బంపఁజేసిరి- అందొకరిరువురుతప్పఁ జాలమంది నోటీసులుచూచుకొనియు సన్నిధికిరాక యవిధేయులైనందునఁ బీఠాధిపతు లవ్వారల కాంక్షాపత్రికం బం

పిరి-నోటీసుచూచుకొనని మఱియొకసంసర్గి యాంధ్రపత్రికం బ్రకటించిన సన్నిధి
శిష్యునిమీఁదను మఱియొక కావలిబ్రాహ్మణునిమీఁదను దనకుఁగూడ
బహిష్కారము నెఱిఁగించిరని యభియోగముం దీసికొనివచ్చె- చాలవఱ కిప్పటివిమర్శ
కులును వారేయగుట నాయభియోగమం దయ్యెడువురకు చెఱినూఱురూపాయలు జరి
మానావిధించిరి. కానియందుఁగూడఁ గారణము స్వాములవారు బహిష్కృతులఁజేసని
వారికి బహిష్కారమెఱిఁగించుటయేయని నిర్ధారణచేయఁబడియె- నిజమునకువారు శ్రీ
వారెవరికిఁబత్రికనిచ్చిరో వారికే బహిష్కృతిప్రకటించిరికాని యందలిఫిర్యాదిపైఁ బ్ర
చురింపనేలేదు. కేసునం దటులేగుజూవైనది. అప్పీలులో యాథార్థ్యముంగుఱుతిం-
రు200లు తిరిగియిప్పింపఁబడియె- శంకరకరుణచే నిట్టికలవరములనన్నింటిని సరకుగొన
క వత్సరత్రయమునుండి శ్రీవారు నెల్లూరుమండలం బలంకరించి యింకనునందలి సంచా
రపుఁగొదవయుఁ దత్రత్యులసంప్రార్థనము నిలిచియున్నను జాతుర్మాస్యవ్రతమున కను
కూలమగు గ్రామమని కాఁబోలు వంగవోలుతాలూకా యీతముక్కలగ్రామముం బ్రవే
శించి యచ్చట నన్వహము నగు శ్రీచంద్రమౌళీశ్వర సేవాసత్కారములకును దీర్థప్రసాద
ములకును బాత్రులంజేసి చతుర్వర్ణజనులం బునీతులఁజేయుచున్నవారు- అనుదినము
దగ్గరదగ్గర వేయిమందిబ్రాహ్మణులపర్యంతము నగుచుండిన యన్నదానమునకును నయ్యా
యిదేశోపకారకార్యములకును, ఆస్తికవిద్వత్సన్మానమునకును శ్రీవారు వెచ్చించెడిధన
ముంజూచి మఠమునకుండిన 20000రూపాయలయగ్రహారములును సర్వదాశిష్యకోటులర్పిం
చెడి యుపాయనములును సార్థకములగుచున్నవనితలఁపని యవివేకియుండఁబోఁడు- ఇ
ట్టిగురుస్వాములపైనొకరు 19-8-15వ తేది యాంధ్రపత్రికలో నేమేమో యవాచ్యము
లం బ్రకటించి తనదౌర్భాగ్యమంతయు వెల్లడించుకొనియె- అందలి దూషణభాగమం
తయునటుంచి వ్యాసకర్త యుద్దేశము విచారించిన యతులకు గజతురగాందోళికాది వై
భవమును బరివారమును బ్రాహ్మణాన్నప్రదానమును భక్తులప్రార్థనపైనంగీకరించెడి యు
త్సవములును ననవసరములనియు మఠమునం దీయుయ్యెడి వ్యయభాగమంతయు దేశోప
ద్రవకరమనియు నీచజాతుల బాగుపఱుపవలెననియుఁ గాలానుగుణములగు మార్పులాచ
రింపవలెననియు యతులు పాదచారులై సర్వదాజనులకు సద్బోధలుచేయుచు వేళకింతక
బళ మెవ్వరేనిడిన సరి, లేనిచో భైక్ష్యమాచరించి దేహయాత్రగడపవలెననియు నైయు
న్నయవి. భైక్ష్యమాచరించుచుఁ బాదచారులై పర్యటింపవలసినవారు కేవల స్వసంతర
ణార్థమైసన్యసించినయతులుకాని శంకరగురుపరంపరాగతులై వర్ణాశ్రమధర్మవ్యవస్థాప
నయం దధికృతులైన మఠస్వాములుకారు- ప్రజాపరిపాలనమునఁ బ్రభువులకెంతయధికార
మో వర్ణాశ్రమధర్మనిర్ణయమునఁ బీఠాధిపతులకంతయధికారము. నిగ్రహానుగ్రహసౌక
ర్యమునకుఁ బరివారముతోఁ బ్రభువులకెంతయావశ్యకతయో మఠప్రభువులకును నంత
యావశ్యకత పరిపాలకులగు ప్రభువులకుఁ బన్నుగట్టుటయందుఁ బ్రజల కెంత బాధ్య
తయో యాచారవ్యవస్థాపకులగు యతీశ్వరులవిషయమైకూడ నంతబాధ్యత- ఇట్లు
ధరాధిపతులయధికారముతోపాటు పీఠాధిపతులయధికారముకూడ మొదటినుండియు

వచ్చుచున్నయది-అందువలన నేదొరతనమువారు వారిశాసనమవశ్యంభావ్యముగ నంగీకరిం
చుచుఁ దామును గౌరవభావమును జూపుచున్నవారు-శంకరులు పాదచారులై పరిజనా
భావముగఁ బర్యటించిరనికదా వీరియభిప్రాయము-శంకరులు లీలార్థమవతరించిన సాక్షా
చ్ఛంకరులు-ఆకాశగమన పరకాయప్రవేశాదిసిద్ధులుగలిగి క్షణమాత్రమున జగమంతయు
సంచరించుసామర్థ్యము చాలఁగలిగియుండిరి-వారు దర్శనమిచ్చి క్షణమాత్రము సంభా
షించిన నెంతెంతదుష్టులును శిష్టులై శిష్యత్వమంగీకరించి వెంటనంటిరి-ప్రభువులెల్లఁ బ
రిజనులైరి-ఈయంశము:॥ శిష్యేషు త్రిసహస్రేషు కేచిత్తంశంఖపూరణైః। కేచిద్వాద్యవిశే
షైశ్చ కేచిత్తాళైశ్చభోక్తిభిః॥ కేచిద్ఘంటానినాదైశ్చ కరతాళైశ్చ కేచన। కేచిద్వ్యజనవా
తైశ్చ పింఛవాతైశ్చ కేచన। సమర్చయంతి సన్యస్తసుఖదుఃఖం యతీశ్వరం॥...తతస్సమా
కర్ణ్య పకాశిరాజః కాశ్యామధీశ స్సుకృతాతిరేకాత్, సమేత్యసాకంనిజపౌరవర్గైః ప్ర
త్యగ్రహీదస్య పదారవిందం॥ ఆదత్త తస్మై మకుటం మహార్ఘ్యం కేయూరయుగ్మం మణి
కాంచనాఢ్యం। శ్వేతాతపత్రం శిబికాంవిచిత్రాం శశిప్రభాఢ్యే సితచామరేద్వే॥ పుత్రైః క
ళత్రైస్సహ భృత్యవర్గైః మిత్రైస్సమంతోదపిపౌరవర్గైః। తతోపదీకృత్య నిజంచ రాజ్యం
సాకంధనేనాఖిల వాహనేన॥ భృత్యోప్యపమంసేవనమాచరన్ స బద్ధాంజలి
శ్శిష్యపదేవతస్థౌ॥ ఈ మొదలగు శంకరవిజయశ్లోకములు తెలుపును-మఱియు,
శ్లో॥ ఏతచ్చ మౌక్తిక చ్ఛత్ర మాందోళికాది యద్యద్దత్తం రాజభీ రాజచిహ్నం। తత్సర్వం తే
ధారితంచాపిభూషాత్ నిర్దోషిత్వం తేస్తుపీఠక్రమేణ॥ యను రేణుకాతంత్రములోని
విద్యారణ్యులంగూర్చి లక్ష్మీసరస్వతులు చెప్పినవాక్యమునుండి రాజచిహ్నములు యతిధ
ర్మములు కావన్నను పీఠాచార్యులకుఁ జెల్లుననియున్నందువలన వారు దోషులుకారని
తెలియవచ్చుచున్నది-ఇత్యాదిశిష్టచరిత్రజ్ఞానములేక "ఒక పరిచారకుడు యేమాత్రము నిలు
వుదలలేక పెద్దవిసనకఱ్ఱతీసికొని విసరుచుండెను...ఉత్సవము వేళను స్వామివారిని...
ముత్యపుసరులు వ్రేలాడఁగట్టిన బంగారుకిరీటమునగైరా ఆభరణములతో నాటకములోని
పాత్రవలెనున్నట్లు అలంకరించిరి" అని యిత్యాది గర్హ్యవాక్యములులిఖించి యాలేకరి
తన యసంభావ్యతం బ్రకటించెను. బ్రాహ్మణాన్నదాన మహిమం జెప్పెడి
యీ ప్రమాణములఁ జూడుడు, శ్రు॥ యద్బ్రాహ్మణో భోక్ష్యన్నం దదాతి
తన్మనుష్య యజ్ఞస్సంతిష్ఠతే॥ భాగవతము సప్తమస్కంధము,
శ్లో॥ నహ్యగ్నిముఖతోయం వై భగవాన్ సర్వయజ్ఞభుక్, ఇజ్యేతహవిషా రాజన్! య
థావిప్రముఖేహుతైః॥ ఇత్యాద్యులనేకములు- అన్నస్యక్షుధితంపాత్రమనుశాస్త్రము
నుబట్టి బీదలుకూడ నన్నదానమున కర్హులే. అదియు స్వాములవారి సత్రమునయతి[illegible]ం
చిత్తుగసాఁగుచునేయున్నది. ఇంకను గొడవయున్న నీబోధకులు చేయఁగూడదో? బీద
లయం దింతపరిపూర్ణానుగ్రహముగల సంఘసంస్కారులు తాము మహైశ్వర్యమునఁ
దులఁదూఁగుచు మిద్దెలు మేడలు గట్టి భోగసక్తులుకాక వారికి సత్రములేల పెట్టింప
రాదు? మతయాచారము నగ్రజాతులయహంభావము కులగురువుల యుపేక్ష హీన

జాతులను క్రమముగా నన్యమతములకుఁ బొలఁదోలుచున్నవఁట. బ్రాహ్మణవర్ణమునఁ బుట్టినవారే భ్రష్టులై శ్రుతిస్మృతిదూరమగుమతమునఁ బ్రవిష్టులగుచుండ నిఁక హీనులసంగతియా మనము విచారింపవలసినది. స్వాములవారికి ముఖ్యకర్తవ్య మిది యా? కాలమునుబట్టి ధర్మముల మార్పుచేయవలెనని పోరాడెడి వీరిమాటలా మనము లెక్కింపవలసినది. వారి దేశోద్ధారము తమరుపట్టిన యశాస్త్రీయపుఁబట్టువల నంగీకరింపని యాస్తికులఁదిట్టిపోయుటయే. వీరిక్రొత్తచట్టములేమిటివి? విధవావివాహము, రజస్వలావివాహము, దూరసాగరయాత్ర, ఏకజాతీయత, ఇవిముఖ్యములు. ఇట్టి మార్పులకు ధర్మవాసనగల యనేక చతుర్వర్ణజనులే యంగీకరింపకుండ శీతాచార్యులేలయంగీకరింతురు? అంగీకరింపనివారిని వీరలేమితిట్టిన నేమియగు? "ఊరూరబీదజనులను బీడించి భిక్షుఅని పేరుపెట్టిదినమునకు రు206-12-0చొప్పున వసూలుచేయుచు"ననియునుత్సవమునకు రు56-12-0యిచ్చుకొనలేమనరొయ్యాఅని గ్రామస్థులు, ఇచ్చుకొనకతప్పదు...అని స్వామివారినొకర్లు, అనియుఁ జైలేఖకుఁ డాంధ్రపత్రికాపాఠకులకు శ్రీవారిపై నగౌరవముకలుగఁదగిన ప్రల్లదముల నుపయోగించినందులకుఁ దగినఫల మాపరమేశ్వరుఁడు త్వరలోనేనసముకూర్పఁగలఁడు-యతినిందా కులక్షయః- పలుమంది తామెయుత్సవభిక్షాదులు ప్రార్థించిచేయుచుందురు- కొందఱు చేయఁదలఁచియు ద్రవ్యలోభమునుజూపినప్పుడు స్వామివారి మంత్రిప్రభృతులు నయభయములచే వారినొప్పింపనేచూడుఁడు- అది చెంపఁగొట్టి పాలుత్రాగించుటకాదో? సన్నిధియుండిన పరివారపువేతనములకేమి యన్నప్రదానమునకేమి యుత్సవాదులకేమి యగుచుండెడివ్యయములకు శిష్యులు ధనమర్పించుటకు సౌభ్యమహిమను దత్కాలమునకొకింత కష్టముగఁదోఁచినను నదిచెఱకునకుఁబాఱిననీరగును గాని యిష్యముకాదు కావునమఠాచార్యులమహావైభవముగ నికనులువుండియట్లువ్రాసినయావాచాటునివ్యాస మెవ్వరేనిసరకుగొనక ప్రవృద్ధగురుభక్తులరై ప్రవర్తిలుదురుగాక-



క॥ వీరందఱు వలదన్ననుఁ నేరో మత్పత్రికం గ్రహించుచునున్నా
రీరోజుదాఁక నేలోఁ టారయఁగానంగరాదు హరికృపకలిమిన్॥
క॥ ప్రస్తావమువచ్చుటచేఁ బ్రాస్తవముం దెలుపఁదలచి వ్రాసితిని నే
ప్రస్తుతవిషయముగామినిఁ విస్తారంబేల యవలవెళ్లుదునింకన్॥

విశ్వకర్మ అష్టవసువులలో వకడయిన విభావసునికుమారుడని భారతము * ఆదిపర్వము 60 పేజీలో చెప్పబడివున్నది.

Cross. యీకేసుఆరంభించినది మొదలు నాసాక్షులనువిచారించేటప్పుడు నేను కోర్టులోవున్నాను. అభినవసరస్వతిపత్రికాధిపతిని నేను. ఆపత్రికస్థాపించి 3 యేండ్లుఅయినది. నా ప్రతిపత్రికలో ప్రతివాదులకులమువారినిగురించి వ్రాసినాను-నేను దావా దాఖలుచేసినతరువాత ప్రతివాదులకులమువారు ప్రబోధినిఅని ఒకపత్రికప్రచురించి దానిలో యీవ్యాజ్యమునుగురించివ్రాస్తే నేనుదానికి ఖండనగా అభినవసరస్వతిలో వ్రాసినాను-ప్రబోధినిని ప్రతివాదులు ప్రచురించలేదు. నేను పెట్టినక్రిమినలుకేసులో ప్రతివాదులను మావూరిపెద్దకాపును మునసభును ముద్దాయిలనుగా చేర్చినాను-దావాదేవాలయములకు యీనాములుగాని ధర్మకర్తలుగాని లేరు-గ్రామమునసభు పెద్దకాపుప్రతివాదులంప్రతిష్టచేయుటకు కుమ్మక్కైచేసినారుకనుక వారిని ముద్దాయిలుగాచేర్చినాను. 22-7-1906 సంవత్సరము నేనుమావూరయినజానపాడులో వున్నాను- ప్రతివాదులలో 1 ప్రతివాది ప్రతిష్టకర్మజరిపినాడు. ప్రతిష్టకర్మచేయిస్తుండగా నేనుచూడలేదు-వూరిలో వూరేగిస్తుండగా చూచినాను- 1 ప్రతివాది నందిగామతాలూకావాడు- 1 ప్రతివాది చనిపోయినాడు-కాటూరి నారాయుడు జాజ్జారు మల్లయ్య 1 ప్రతివాదినిపిలిపించినారు. కంసాలిఅనేపదమునకు వుత్పత్యర్థము చెప్పజాలను- బ్రాహ్మణుడుఅనగా బ్రహ్మయొక్కసంతానమని ఒకఅర్థము-బ్రాహ్మ అనే పదములో సంతానముఅని అర్థములేదు-నేను వేదము చదువలేదు. కంసాలులు యితరులయిండ్లలోభోజనముచేయడము నేనుచూడలేదు-కంసాలులు బ్రాహ్మణులయిండ్లలో నీళ్లుతాగరు-మాయింటికి దావాదేవాలయములకు ఫర్లాంగుదూరమువున్నది. దావాదేవాలయము పట్టాభూమో పోరం

* భారతము, ఆదిపర్వము 60 వ పేజీ.

వ॥ ప్రభాసుండను వసువునకు బృహస్పతి చెలియలైన యోగసక్తకు విశ్వకర్మపుట్టె
కం॥ ఆవిశ్వకర్మనిర్మిత, దేవవిమానుండు నిఖిలదివ్యాభరణ
శ్రీవిరచనపరితోషిత। దేవుఁడుశిల్పప్రజాపతియునై నెగడెన్॥

క॥ తదనంతరసాక్షిగనై। యెదియోవచియించినాఁడ నేఁగూడనటఁ
ఒదవెడిసీతారామా। భిధబుధురుడిఖండనంబు పెల్లుగ దానఁ॥

---

బోకో నాకు తెలియదు- నేను సంప్రోక్షణసంగతి ఏగ్రంథములోవున్నది చెప్పలేను- లీలావతిగ్రంథములో వున్నది. లీలావతి ఆగమశాస్త్రము. స్మృతిముక్తాఫలము 1882 సంవత్సరములో అచ్చుపడినది- అంతకుముందు యిట్టిది అచ్చుపుస్తకము వున్నదేమో చెప్పజాలను-విశ్వకర్మశబ్దము పరాత్పరునకువర్తిస్తుంది- వేదములలో విశ్వకర్మశబ్దముపరాత్పరునికి చెప్పబడినది- దేవతలశిల్పివిశ్వకర్మ. ఒకటికాదు-నాది కృష్ణయజుర్వేదము-నాది హారితసగోత్రము-మాకు ఆంగీరస, అంబరీష యౌవనాశ్వ అని ముగ్గురుబుషులు- నవబ్రహ్మలుఅనేది 9 మందిబుషులు-మాప్రవరలోనిబుషులు బ్రాహ్మణులే-బుషులంతా బ్రాహ్మణులే-దావాప్రోలేలమ్మదేవాలయము నేనుఎరిగినప్పటినుండి వున్నది-పాతపాటమ్మగుడి నేనుఎరుగకమునుపునుంచి వున్నదిగాని 7,8 యేండ్లక్రింద అదివరకు వాగుఅవతలవుంటే వూళ్లోగుడికట్టి అక్కడ సంప్రోక్షణచేసినారు-వూళ్లోవారంతా చందాలువేసుకొనిప్రతిష్టచేసినారు-నేనుఎరుగకమునుపు ఆగుళ్లు ఎవరుకట్టినది నాకు తెలియదు. 5,6 ఏండ్లక్రింద బ్రాహ్మణులుప్రతిష్టచేసినప్పుడు ముదిగొండవీరభద్రయ్య చేయించినాఁడు-ఆవీరభద్రయ్య ఆరాధ్యుడు-నాతరఫుసాక్షులలో ఆరాధ్యులు వైఖానసులు లేరు-దావాకుపూర్వము యీగుంటూరుజిల్లాలో వైదికులుప్రతిష్టచేయించగా చూడలేదు-నైజాముయిలాకాలో చూచినాను-నేను అనేకపర్యాయములు యీదేవతలకు బోనము చెల్లించినాను-ఎప్పుడెప్పుడు చెల్లించినది చెప్పలేను-కూరపాటివెంకన్నగొబ్బినాగన్న వగైరా చూచినారు-గుడికట్టేటప్పుడుబ్రాహ్మణులుచందాయిచ్చే ఆచారములేదుగనుక నేను చందాలుయివ్వలేదు- కొల్పులరోజులలో దేవతకుతీసుకొనిపోయిపబోనము నైవేద్యము పెట్టినకుమ్మరవాడికియిస్తారు- నిరుడుదావాదేవాలయములోకొల్పులుజరిగినవి-అప్పుడు బ్రాహ్మణులుయెవరు పోలేరు-గ్రామకరణము పోలేదు-దావాదేవాలయములు గ్రామకంఠములోనేవున్నవి-దానిప్రక్కన వున్నంరామయ్యయిల్లువున్నది- గుడిపట్టుస్థలము వున్నము రామయ్య పట్టాభూమో కాదో నాకు తెలియదు- పాతపాటమ్మ యిప్పటిశిల క్రొత్తదితెచ్చినారు.దానిని దుర్గిలో కొనితెచ్చినారు ఎంతకుతెచ్చినది నాకుజ్ఞప్తిలేదు. పాతపాటమ్మఅనేపేరు గ్రంథములలోలేదు-ప్రోలేలమ్మ అనేపదము లేదు-5 సంవత్సరములక్రింద ప్రాణప్రతిష్టచేసిన బ్రాహ్మణులమీద విరోధముచేత ప్రతిష్టచేయించినారు గాని బంగారురేకుపోయి సరగానిలవకపోతే కాదు-ప్రతివాదులకు నాకు స్వాయముగా వి

క॥ సామాన్యులుకొందఱు మ
గ్రామనివాసులునుగూడఁ దత్తద్విషయా

రోధములేదు-నాకు యవరితోటి విరోధములేదు. ప్రోలేలమ్మ అనే పేరునే సామాన్యజనులు పోలేరమ్మఅని వాడుకుంటారు-స్మృతులు నేను ప్రత్యేకముగా కంఠోపాఠముగా చదువలేదు. నేను పురాణములైనా స్మృతులయినా అవసరముబడ్డప్పుడుచూచుకోవలసినదే-మనుస్మృతిలో ప్రజాసృష్టికిసహాయకారులు 10 మందిగాచెప్పబడివున్నది. మాతండ్రి పౌరోహితముచేసేది. మేము అన్నదమ్ములము చేయడములేదు నాకు పొలమువున్నది-అది పాలికియిచ్చి నేను అష్టావధానముచేస్తానుగనుక సభలుచేసి జీవిస్తాను...జానపాటి పట్టాభిరామశాస్త్రి వ్రాలు...

The 31st day of August 1911 ... జానపాటి చినఅప్పయ్య... జానపాడు...

మావూరిలో ప్రోలేలమ్మ పాతపాటమ్మ దేవాలయములువున్నవి. ఆగుళ్ళలోను మారు 3,4 సంవత్సరములక్రింద కంసలబత్తులు ప్రతిష్టచేసినారు-అదివరకు యీ దేవాలయములలో బ్రాహ్మణులుప్రతిష్టచేసినారు-కంసాలీలుప్రతిష్టచేయకపూర్వము 2,3 యేండ్లక్రింద ఆగుడులకు బ్రాహ్మణులుప్రతిష్టచేసినారు. పోలేరమ్మగుడిలో చెట్టు పెరిగి గాలికి ఆచెట్టుపడి శిలపగిలి గుడిపడితే క్రొత్తగా గుడికట్టిన్ని పాతపాటమ్మగుడి వాగుఅవతలవుంటే అక్కడినుంచి తెచ్చికట్టి సంప్రోక్షణచేయించినారు-ప్రోలేలమ్మపాటపాటమ్మకు మాదిగె మాల తురకలు లింగధారులు కంసాలీలు తప్ప కడమవర్ణములవారు బోనములుచెల్లిస్తారు- కంసాలీలుసంప్రోక్షణచేసినదరిమిలా కొల్పులుజరిగినవి-అప్పుడుబ్రాహ్మణులు కోమట్లు కొందరుశూద్రులు బోనాలుతీసుకపోలేదు. కంసాలీలుప్రతిష్టచేసినదేవత మాకుపూజార్హములుకావని తీసుకపోవడములేదు. అదివరకు మేము బ్రాహ్మణులము బోనములుతీసుకపోయేదే. కంసాలీలయిండ్లలో యేజాతివారు భోజనముచేయరు. వెనుక బ్రాహ్మణప్రతిష్టజరిగినప్పుడు నేను రాయిడి వీరయ్య తొండపినుంచి వీరభద్రయ్యను తీసుకవచ్చి చేయించినాము. Cross వాదినా పెత్తండ్రికుమారుడు. వాదితాలూకు పౌరోహిత్రము నేనుచేయడంలేదు. మాకు పౌరోహితము యీనాములేదు. మావూళ్ళో శూద్రులయిండ్లలో పౌరోహితం నేను యితర్లుచేస్తాము. స్ఫోటకము దేవతఎవరో నాకు తెలియదు. మావూళ్ళోజాడ్యములుయేవివచ్చినా యీప్రోలేలమ్మ పాతపాటమ్మలకు కొలుపులుచేస్తారు. పాతపాటమ్మగుడిపట్టుస్థలము యవరిదో నాకు తెలియదు. అది పట్టాభూమిలోవున్నది గ్రామకంఠములోవున్నది చెప్పలేను. పాతపాటమ్మను అక్కడ ప

లేమరక చెప్పవచ్చిరి
యీ మన రథకృత్ప్రతిష్ఠ యిష్టముగామిన్ ॥

---

ప్పుడు పెట్టినది నాకు తెలియదు. నేనెరిగినతరువాత కంసాలీలుచేసినప్రతిష్ఠకుపూర్వము 4,5యేండ్లక్రిందజరిగినది. అంతకపూర్వము అక్కడ వూరికి శిలలు పెట్టినారో ప్రాణప్రతిష్ఠచేసి పెట్టినారో నాకు తెలియదు. ప్రతివాదులనుపిలిపించకపూర్వము వారినిపిలుపించి సంప్రోక్షణచేస్తామనిచెప్పలేదు. సంప్రోక్షణదోషం బ్రాహ్మణులందరము వద్దని చేయకూడదని చెప్పినాము. కరణము కొందరుకాపులు మేము చేయిస్తామన్నారు. అంతటమేమువచ్చినాము. ప్రతిష్ఠజరుగబోయేముందు వాది కొందరుబ్రాహ్మణులతో ముందువెళ్లినాడు. దరిమిలా నేనువెళ్లినాను. ప్రతిష్ఠజరిగేటప్పుడు నాకు తెలియదు. ప్రతివాదులు ప్రతిష్ఠచేయించినరోజే ప్రతిష్ఠచేయిస్తారని తెలిసినది. నేనుమేజస్ట్రీటుకోర్టులో సాక్షినిగాను. ప్రతివాదులుచేసినప్రాణప్రతిష్ఠకు గ్రామములో అంతా చందావేసుకున్నారేమో స్వయముగా తెలియదు. యీచందాలలో మేము యేమిజోక్యము కలుగచేసుకోలేదు. తిరుగ ఎందుకుప్రతిష్ఠచేయించవలసివచ్చినది నాకు తెలియదు. ప్రతివాదులుప్రతిష్ఠచేసినదరిమిలా 2,3 సార్లు కొల్పులుజరిగినవి. మొదట 7,8 యేండ్లక్రిందట బ్రాహ్మణులుకొల్పులుచేసినతరువాత ఒక సారికొల్పులుచేసినట్టు జ్ఞాపకము. ప్రతివాదుల ప్రతిష్ఠకుముందు 5,6 మాసములక్రిందకొల్పుజరిగినట్టుజ్ఞాపకము. ప్రతివాదులుప్రతిష్ఠచేయకముందు ప్రతికొల్పుకు మేము బోనముచెల్లించేది. దరిమిలా చెల్లించుటలేదు. మేము బోనముచెల్లించుటలేదుగనుక దేవాలయముదగ్గరకు వెళ్ళుటలేదు. అప్పుడు ఎవరెవరు బోనముచెల్లించినది చూడలేదు. విశ్వబ్రాహ్మణులు తక్కినజాతులవారియిండ్లలో భోజనముచేయరు. మొదటిసంప్రోక్షణకుకూడా నేనుతిరిగి చందాలువసూలు చేయలేదు. మేముఎప్పుడు చందాలుయిచ్చేదిలేదు. శివాలయములలోకి కంసలబత్తులురారు.....జానపాటి చినఅప్పయ్య వ్రాలు.

The 1st day of September 1911 కూరపాటి వెంకయ్య

నాది జానపాడు. మావూళ్ళో పోలేరమ్మ పాతపాటమ్మగుడులువున్నవి. వాటిలో కంసలబత్తులచేత షుమారు 4 యేండ్లక్రింద ప్రతిష్ఠచేయించివారు మావూరిబత్తులు 2,5 ప్రతివాదులు 1 ప్రతివాదినితెచ్చి ప్రతిష్ఠలుచేయించినారు. మునసబు కరణము గూడా కుమ్మక్కుచేసినారు. అదివరకులింగధారిఆయనవచ్చి చేయించినాడు. వెనుకకొల్పులకు బ్రాహ్మలు కరణాలు కోమట్లు సంసార్లు అంతాకొల్చినారు. కంసలబత్తులు రాలేదు. బత్తులుప్రతిష్ఠచేసినతరువాత కొల్పులుజరిగినవి. ఆకొల్పులకు నేను వెళ్ళలేదు.

బళిర! యేతద్గతి నెసంగి కొలను మిగులఁ
గనఁగఁదగియుండె నొక ప్రౌఢకన్యపగిది
కచకుచప్రేక్షణస్మిత రుచిరలగుచుఁ
దననువీక్షింపనే తెంచు తరుణులకును॥ 134

మ॥ రమణుల్ బంగరురంగు వ్రాఁతపని చేలల్ నేర్పుమై నూడ్చి క్రొం
జిలుగుంజందురు కావిపావడ లొగిం జెల్వొందఁగాఁ గట్టి హా
ర లతాళుల్ సడలించి యొయ్యారులు దోర్వ్యస్తోరుహస్తాబ్జలై
యల రారన్ నెలరాల మెట్లులఁ బదన్యాసంబు గావింపుచున్॥ 135

వ॥ మెల్లమెల్లనడిగ్గి, 136

క॥ "విషభవభవుఁ డమృతముకు
విషామృతసమాఖ్యలొసఁగె వీనిని దలఁపన్
విష మనఁగా విషమంబగు
విషమముగా దమృతమనఁగ విషముఖులారా!"॥ 137

వ॥ అని యిత్తెఱంగున నమ్మత్తకాశినులయ్యంబుల సంభ్రమాయత్తచిత్తలై కొంతతడవు కొనియాడి,॥ 138

సీ॥ "కలకంఠకంఠితో జలకమాడఁగఁబోకు
పల్లవపాణివి పణఁతి! నీవు
బాలేందుఫాలతో నోలలాడఁగఁబోకు
పంకజనేత్రవు భామ! నీవు
ఇభరాజగమనతో నీఁదులాడఁగఁబోకు
రంభోరుకాండవు రమణి! నీవు
చంపకనాసతో సయ్యాటలాడకు
మత్తాళివేణివి మగువ నీవు
సంకుమదగంధితో నీవు సరసమాడఁ
బోకు చిలుకలకొలికివి పోలఁతి" యనుచు
నొండొరుల కేర్పరింపుచు నొప్పుమిగిలి
రంబుజాకరసీర విహారవేళ॥ 139

శా॥ కేలం దమ్మిఘటించి యొక్కమదిరాక్షీరత్న మవ్వేళఁ దా
శ్రీలక్ష్మింబలె గంగమీఁదె,నొకరాజీవాస్య బల్కొప్పునన్
లీలం గైరవమూని చందురుని మౌళిందాల్చెకన్ మీఱు మా
నాళీకేక్షణభంగిఁ బెంపెసఁగెఁ గాంతాలోకమధ్యస్థలిన్॥ 140

తే॥ హారుఁడువిషమూనె నదియొక్కబిరుదు దలఁప
విషము నేఁద్రావుదునటంచు విస్మితముగ
వెలఁదియొక్కతె కరమున విషముఁబట్టి
యచ్యుతానంతగోవింద యనుచుఁద్రావె॥ 141

చ॥ కువలయవేణియోర్తు మెఱుఁగుల్ తగఁగుల్కెడి గొప్పకొప్పున
న్గువలయమేర్పడన్నిలుప గొబ్బుననిల్వక నీటిలోఁబడెన్
జవమునఁ దత్కచంబు తనసాటికిరా వడిఁద్రోచియ నాత్మసం
భవమహనీయసీమఁ దనభంగము దెల్పఁగఁ బడ్డకైవడిన్॥ 142

సీ॥ ఉరికెక్కి మెల్లన సరసిజాకరములోఁ
దోలఁగక గుభగుభ మునికెనోర్తు
కలువరేకులఁ(దెంపి)మొలఁకువ నొకకాంత
కలికిపీనులమీఁద నిలిపెనోర్తు
కెందమ్మిపుష్పోడి కేలఁదాలిచి యొక్క
సకియగుబ్బలమీఁదఁ జల్లెనోర్తు
నడినీటిలోదూకి నారులెల్లనుజూడ
లీల నల్లంతటఁ దేలెనోర్తు
తెఱవలకునెల్ల నుపమాలు గఱపెనోర్తు
పంకజాళులఁగని యబ్రబపడియెనోర్తు
ముగుదఁగనుగొని లేనవ్వునగియెనోర్తు
కుటిలకుంతలపై నీరుగుప్పెనోర్తు॥ 143

చ॥ వెలఁదియొకర్తు కాండమున వెల్లకిలంబడి యీఁద నప్పుడా
జలజదళాయతాక్షి జిగిచన్నులు చూడఁగనొప్పె మన్మథుం

డల రతి పంతమాడి జలజాకరపుష్కరమధ్యమంబునం
దలరుచుఁ జిత్రవైఖరుల నాడెడి బంగరు బొంగరాలనన్॥ 144
చ॥ ఘనకుచయోర్తు శోణమణికల్పితముద్రిక నీటిలోఁబడన్
ఘనకచనోర్తుఁగాంచి కరకంకణమిచ్చెద దీనిఁదెమ్మనన్
మునిఁగిజలాంతరస్థలిని ముద్రికయుండినఁ దెచ్చియీయ వే
వనకణమిచ్చెఁ గొమ్మనుచు వారిజనేత్రి విచిత్రమందఁగన్॥ 145
తే॥ కలికియొక్కతె పుండరీకంబు లీలఁ
గేలఁదాల్చినఁ దత్కరకిసలయారు
ణచ్ఛవిచ్ఛట లాగిఁ గ్రమ్మి నవ్యహల్ల
కాకృతినిగానఁబడ వెఱగందెనొర్తు॥ 146
క॥ ఏణాక్షీకుచలోచన। నూనితవరదేహమిళిత మంజుహరిద్రా
నూనాంజనగంధాప్తిఁ ద్రి। వేణీసంగమముభంగి వెసఁగొలనమరెన్॥
క॥ తారామలయజగంధులు। తారామలనఖరఁగాంచి దారుణతాపో
దాగతఁగ్రాగుచునుండిన। నూరకమనమిట్టులుంట యొప్పదటంచున్॥
సీ॥ గుజ్జుమావులదండ గొజ్జంగిపొదరిండ్ల
విరిమంచు బోరునఁ గురియుచోట
అల్లిబిల్లిగ మొల్లలల్లుక తగనిరుల్
గుప్పెడు కురువేరుచప్పరముల
నీడచల్వలుదేరు నెలరాలదోనలకై
యేతెంచుపూఁదేనె యేటికాల్వ
దరిని జెల్వగు బండిగురువింద లేతీవె
చవికెలపజ్జద్రాక్షలుపొసంగఁ
బైఁబెనంగిన యనఁటికంబములపొంత
కలువకొలఁకులఁ గెలకులఁ దోలుకనలరు
తమ్మిబావుల తావులుగ్రమ్మ ననుచుఁ
జంద్రకాంతవితర్దికాస్థలమునందు॥

తే॥ సారవిస్తారఘనఘనసార గంధ
సార కల్హార నీహార నీరపూర
సౌరభోద్గార చారుమందార వార
మధురమధురసములుదెచ్చి మసలకవుడు॥ 150
తే॥ చెలిమికత్తెలు పన్నీట జలకమార్చి
కనఁగనొప్పారు చలువలు గట్టనిచ్చి
పొసఁగఁ గర్పూరనామంబు నొసటదిద్ది
కొమరుచనుగవనడుమ హారము లమర్చి॥ 151
మఱియును 152
సీ॥ కుచముల బహుళ లికుచములంచనిమాని
ఘనసారములదంగఁగడఁగి యోర్తు
నేత్రముల్ శతపత్రపత్రములనిమాని
శీతోదకమునిల్పఁ జేరి యోర్తు
చికురబంధము భృంగనికరమంచనిమాని
హేమదామముఁజుట్ట నేగి యోర్తు
సకలాంగములు శిరీషసుమములనిమాని
వీవన వీవంగ(వెడలి)యోర్తు
చందనామోద లిభ్భంగిఁగొంద ఱెలమిఁ
బొలఁతి కుపచార మొనరింపఁబోయినంత
నరయనపచారమా చుండె ననుచు నూర
కున్న వారలఁగనుఁగొని చెన్నుమిగిలి॥ 153
సీ॥ ఖరకరోదయముగాఁ గాశ్మీరపంకంబుఁ
జనుజక్కవలమెత్తెఁ జాన యోర్తు
ఘనతమోగతిమీఱు మినుకు కాటుక రేఖ
కనుదోవలను దిద్దెఁ గలికి యోర్తు
మకరందరసమొల్కు మందారదామంబు
కచభృంగతతిఁజుట్టెఁ గాంత యోర్తు

చలువలు వెదఁజల్లు మలయజసారంబు
తనువల్లికనలందెఁ దరుణియోర్తు
సముచితోపాయపరలగు చంద్రముఖులు
భూరిశిశిరోపచార శృంగారవిభవ
కలిత లలితప్రకాశ మాంగల్యవిధులు
సలిపిరప్పుడుకొందఱు చక్రికటికి॥ 154

క॥ ఘనసారైలావరచం
దన లామజ్జక లవంగ నవసుమనోగం
ధ నిమేళిత హిమజల మ
వ్వనజాక్షికిఁ ద్రావనొసఁగి వనితలు మఱియున్॥ 155

తే॥ చెలఁగిగొజ్జంగినీరు పైఁ జిలికిచిలికి
కప్పురంపురవల్ నిండ గుప్పిగుప్పి
కమ్మతావులుగలవిరుల్ గప్పిగప్పి
పొసఁగసురటుల గాడ్పుగా విసరివిసరి॥ 156

వ॥ ఇవ్విధంబున శైత్యోదయంబునకై ప్రాణసఖులు సముచిత
శిశిరోపచారంబు లొనరించి రప్పుడు,॥ 157

తే॥ బాల కలఁదిన మలయజపంక మతుల
విరహపరితాపశిఖిశిఖోద్వృత్తి నుడికి
పడిఁ బెటిలి మించుబోడులనడిమి యొక్క
చెలియగుబ్బలపైఁబడ్డ నులికిపడియె॥ 158

క॥ నలినాక్షి హారములు గు
బ్బలసెగ సలసలనుగ్రాఁగి బహుళశ్రమతో
య లహరిఁ దుకతుక నుడుకుచు
నలవక్షము గప్పెఁ గపుర మలఁదినలీలన్॥ 159

క॥ కలికిచనుదోయిపొంగున
బలితముగాబిగిసి రవిక పక్కునఁబగిలెన్

చిలుకపటాణివజీరుని
తలిరా కడిదంపువిసరు దాఁకెననంగన్॥ 160

కం॥ అమ్మక్క! భూరివిరహ భారమ్మునఁ బాండిమమునోహారస్థితి మేనన్
గ్రమ్మకొనినవెన్నెల కీల్బొమ్మయనఁగనపుడు పుష్పబోణి చెలంగెన్

వ॥ అయ్యెడఁ బుష్పబోణిం బుష్పబోణులు తప్పకచూచి శిశిరో
పచారంబునఁ దదీయపరితాపంబు వాయకుండుటయెఱింగి, 161

తే॥ మానవతులంతఁ గేతకీసూనగర్భ
దళమునఁ దుషారజలకణమిళితలలిత
ఘనమృగీమద కర్దమమున లిఖించి
రతులసుకుమారు మారు శ్రీహరికుమారు॥ 162

* చెలికత్తెలు మన్మథునిరూపు లిఖించి పూజించి స్తుతించుట. *

సీ॥ డాపలికరమునఁ దరుణిసింగిణివిల్లు
వలపలికరమున నలరుశరము
అంకపీఠమ్మున నలరారురతిదేవి
వెనుకదిక్కునఁ బ్రభంజనకిశోర
మెసఁగఁ గోపుల వసంతసుధామయూఖుల
ముంగలఁ గలకంఠభృంగకీర
శారికారాజహంసప్రముఖోదార
బలసమూహంబుల విలసితముగ

సారసాక్షులు మన్మథస్వామి పదవి
మొగలిపూరేకున లిఖించి ముదముపొసఁగ
వరపదార్థము లొగిఁ గొనివచ్చి సముచి
తోపచారంబులను బూజ లొప్పఁజేసి॥ 163

చూర్ణిక॥ శ్రీమత్సుధావారాశిరాట్కన్యకా గర్భపయఃపారావార
శరత్సంపూర్ణపూర్ణిమా శర్వరీరమణోదయాయ, రతియువతీ
పయోధరధరస్థలవిన్యస్త ప్రశస్తామోద నిస్తులకస్తూరికా కుం

కుమసంకుమదపంక మకరికాపత్రచిత్ర లక్షణలక్షిత దోర్మధ్య
మధ్యప్రదేశాయ, మధురమధురపారణపరాయణ విభ్రమద్భ్రమ
రపుంజసింజనీటంకారఘోషవిభూషితాఖండమండలీకృతప్రచండ
పుండ్రకోదండనిర్ముక్త ప్రఫుల్లమల్లికాశోకారవిందేందీవరమా
కందప్రసూన భల్లభగ్నహరిహరచతుర్ముఖముఖనిఖిలలేఖసము
దయాంతరంగాయ, శాంబరీకదంబాడంబరోజ్జృంభమాణ
శంబరాసురాఖర్వదుర్వారగర్వపర్వత గీర్వాణవల్లభాయ, పాఠీ
నధ్వజాయ, చైత్రసఖాయ, మన్మథాయ తుభ్యంనమః,, 164
వ॥ అని బహుప్రకారంబుల వినుతించుచుండి రంత. 165

## సూర్యాస్తమయవర్ణన

తే॥ అంచిత రజోరుణావరణాప్తిఁ దనరు
పద్మినిఁ గరప్రకాశత బయలుపఱచి
రహిఁ సహస్సంగమ మొనర్చి ప్రత్యవాయ
మిగుల భృగుపాత మొందిన ట్లినుఁడు గ్రుంకె॥ 166

తే॥ విమలకమలాధినాథదిక్కమలవదన
యినసమాగమమున రాగసునతఁ గనియె
ఇనసమాగమమున రాగఘనతఁ గనుట
కమలనేత్రల కుచితంబుగాదె ధరను॥ 167

మ॥ సమయద్వేషికి నోహటించి యినుఁ డస్తక్షోణిభృన్మౌళిధా
మముఁ జేరంగని యిందిరారమణి యాత్మస్వామి తాదృగ్విధా
క్రమణోదాత్తుఁడటంచు లోఁదెలిసి వీఁకన్ స్వాలయోద్యత్కవా
టము లొక్కుమ్మడి వేసెనాఁగ ముఖముద్రల్ దాల్చెఁబద్మావళుల్॥

చ॥ ఖరకరుఁ డస్తమింప నతిగాఢసమగ్రవిషాదయుక్తిఁ బు
ష్కరిణి వినీలభూరివిషసారకృతాంచితమాత్ర లుజ్వల
స్థిరగతితోన వక్త్రములఁ జేర్చినవై ఖరి డింభకాళితో
సరసిజకుట్మలాంతరనిశాంతములన్ వసియించెఁ దుమ్మెదల్॥ 169

క॥ జలజాకరసంకేత
స్థలమున మత్ప్రియుని రాజు సాంద్రకళాసం
కలితుని బొందెదనని లోఁ
గలకలనగెఁ గలువ చెలువు గనుపట్టంగన్॥ 170

సీ॥ సురసుందరులు లేఖతరుపుష్పధూళిచే
గుప్పిన వెన్నెలకుప్పలనఁగ
తారాపథాతివిస్తారకేదారాంత
రంబున నొప్పు కైరవములనఁగ
సమయకుందక్షమాజాతాగ్రవిభ్రాజ
మానప్రసూన కుట్మలములనఁగ
గోత్రభిచ్ఛుండాల గురుపుష్కరోద్ధూత
గగనధునీక్షీర కణములనఁగ

అధ్వగానూనమానాపహాప్రయత్న
కీరఘోటకరతిశుభాకీర్ణ వార్తి
కములనఁగ బ్రహ్మ మర్త్యులగణుతికెడ్డ
తళుకుసున్నంపుబొట్లనఁ దారలలరె॥ 171

ఉ॥ రంజితలీల సాంద్రతిమిరంబు పొసంగె దిగంతరంబులన్
గుంజర చంచరీక శతకోటిధరాశ్మ ఘనాఘ నార్క భూ
ఖంజన పత్రిపత్రిరథ కంధరవర్త్మ సుధామయూఖల
క్ష్మాంజన కాలకాలగళ హాలహలాభ విభాసమానమై॥ 172

తే॥ ఇక్షుకోదండధరుఁడు సమిద్ధశక్తి
విరహిజనములపై దండువెడల నెత్తు
నీలిడేరావిధంబున నిబిడకాంతి
నంధతమసంబు జగమెల్ల నాక్రమించె॥ 173

తే॥ అనుభవానందపర్యంతమైనబుద్ధి
తత్త్వమందున నెవనికిఁ దగిలియుండు
నతనిదృక్పథవర్తులైనట్టివార
లఖిలకిల్బిషముక్తులై యలరుచుంద్రు॥ 131

చ॥ తలఁప మహానుభావులగు తజ్ఞులదర్శన మబ్బినంతనే
కలుగుసుఖస్థి (తుల్ ధిషణ! కావున వారలఁ) బాసి యజ్ఞులై
యిలఁగలసంసృతిభ్రమల నెంతయు నాతలఁగుంది యక్కటా!
పొలియుదు రేమిచెప్పవలెఁ బూర్వభవోత్కటపాపకర్మముల్॥ 132

చ। అరయ మహానిధింగనియు నాసయొనర్పనిబాలురీతి నీ
ధరణిని మూఢులజ్ఞతను దత్త్వవిదుం బరమేశ్వరేశ్వరున్
గురువరుఁ గాంచియున్ విడిచి ఘోరవిపద్గహనాంతరంబులన్
దిరుగుచునుందు రద్భుతము దివ్యమునీశ్వర! యేమిచెప్పుదున్॥ 133

తే॥ అకట! పరమార్థవేదియైనట్టి సుజను
విడిచి మాయావిమోహితుల్ విహితమునకు
ధరఁజరింతురు వా రమృతంబువిడిచి
విషముద్రావెడివారు భావించిచూడ॥ 134

తే॥ ఇంకఁజెప్పెడిదేమి దేవేజ్య! నీకు
సంగ్రహంబుగ వేదాంతసారమెల్లఁ
బలికితిని శ్రద్ధ గురుభక్తిఁ బరమనియతి
గలుగఁగా స్వానుభూతిని గాంచుమిప్పు॥ 135

క॥ గురునందు దైవమందును।సరిగా సద్భక్తిగల్గుజనులకుఁ దెలియున్
సురవంద్య! నీకుఁదెల్పిన।పరమార్థము సంశయంబుపని లేదెందున్”॥

వ॥ అని భవానీపతి వాచస్పతికిఁ జెప్పెనని సూతుండు శౌనకాది
మునివ్రాతంబుల కిట్లనియె॥ 137

క॥ “ఈరీతిఁదెల్పిశంకరుఁ।డూరకతానుండెఁ బైని నుక్తులులేమిన్
సారముగురుఁడం (తయువివి) భూరితరానందసార పూర్ణుండయ్యెన్॥

క॥ మీరు మహాత్ములు నాచే।సారజ్ఞానంబువిన్నసరసులు నిత్యో
దారులుకృతకృత్యులుభవ।దూరులు వర్ణింపవలదదోషమనస్కుల్॥

లింగేభగవాన్ పూజాంగృహ్ణాతిధూర్జటిః॥ అసంపూర్ణకృతాపూజా మంత్రద్రవ్యక్రియాగుణైః తథాపిలింగేసంపూర్ణ పూజాభవతిషణ్ముఖ!॥ ఇత్యాదిపద్మపురాణ సూతసంహితాది ప్రబలప్రమాణానురోధముచేఁగూడ సాలగ్రామబాణాదులయందుఁ దత్తత్పూజ యాచరింపఁబడుచున్నది. ఇట్లు ప్రమాణములుండుటచేతనే యుపాసనాకాలమందాధారములగు వస్తువులు శాస్త్రోక్తములైనవే కావలెనని గ్రంథాదియందు వ్రాసియుంటిని.

సాలగ్రామపూజ స్మృత్యంతరమున నుదాహృతమైనచో నది బ్రహ్మబంధువిషయమని పూర్వమే చక్కఁగా నిరూపింపఁబడినది.

అని శ్రీశాస్త్రిగారెదిలిఖించిరో యది పూర్వోదాహృతానేకప్రమాణములచే ద్విజోత్తమవిషయమని ప్రతిపాదింపఁబడుటవలనను బరాశరాదిస్మృతులయందు బ్రహ్మబంధువిషయమని ప్రతిపాదింపఁబడకపోవుటవలనను నజ్ఞవచనమై యనాదరణీయమగుచున్నది. అనవరతము బ్రహ్మబంధువిషయము బ్రహ్మబంధువిషయమను మంత్రమే జపించుటకు శాస్త్రిగారికిది యేగురువుపదేశించెనో కదా? తరువాత శాస్త్రిగారు

శ్రీమద్భాగవత తృతీయస్కంధమున, శ్లో॥ యోమాంసర్వేషుభూతేషు సంతమాత్మానమీశ్వరం। హిత్వార్చాంభజతేమౌఢ్యా ద్భస్మన్యేవజుహోతిసః॥ అనియు శంకరప్రణీతమగు నాశ్చర్యశతకమున, శ్లో॥ మృచ్ఛిలాదారుభిర్గంత అర్చాంకృత్వా హ్యయమ్ముఖాః। ఈశబుద్ధ్వాప్రపూజంతే కిమాశ్చర్యమతఃపరం॥ అనియుఁ జూపిన ప్రమాణముకూడ వ్యర్థమగును,

అని చెప్పిరి. విచారించినచో భాగవతశ్లోకమునఁ బ్రతిమార్చన నిషిద్ధమని మందబుద్ధుల కర్థమగునుగాని మంచివారికిఁగాదు. తదర్థము తద్భిన్నమయియే యున్నది. అచ్చట భక్తిప్రాధాన్యమందుఁ దాత్పర్యముగాని ప్రతిమార్చనానిషేధమందుఁ గాదు. భాగవతమే సహస్రవిధములఁ బ్రతిమార్చనాప్రతిపాదక ప్రమాణగ్రంథమైయున్నది.

ప్రతిమార్చనానిషేధపరమేయని తాత్పర్యము చెప్పినచో నాయధ్యాయమందే తత్పూర్వగ్రంథమందు భక్తియోగోబహువిధో మార్గైర్భామినిభావ్యతే స్వభావగుణమార్గేణ పుంసాంభావోవిలిఖ్యతే యను

శ్లోకముచే సగుణ నిర్గుణ భక్తిభేదములఁజెప్పి తర్వాతి మూఁడుశ్లోకములచేఁ దామసరాజససాత్వికభక్తులఁ గనఁబఱచి ముగ్గురికిం బ్రతిమార్చనయున్నదని చెప్పినది విరోధించును. ఈలాగె ముందుకూడ, శ్లో॥ అర్చాదావర్చయేత్తావ దీశ్వరంమాంస్వకర్మకృత్ యావన్నవేదస్వహృది సర్వభూతేష్వవస్థితం॥ అని సర్వవ్యాపకుఁడగు పరమేశ్వరునిదనహృదయమం దెంతవఱకు సాక్షాత్కరింపఁజేసికొనలేఁడో యంతవఱకు స్వీయ శ్రౌతస్మార్తాదినిత్యకర్మలతోఁగూడ నర్చారాధన చేయవలెనని చెప్పఁబోయెడిసంగతితోఁగూడ విరోధించును. శ్రౌతస్మార్తాదికర్మలకుఁగూడ స్వహృదయమం దీశ్వరసాక్షాత్కారకాలమే యవధియని యాశ్లోకమందే సూచనచేయఁబడియున్నది. బ్రహ్మప్రాప్తికిసాధనమగు నిర్గుణభక్తికిసాధనమగుఫలాభిసంధిరహితనిత్యనైమిత్తికాదికర్మములలోఁబ్రతిమార్చనకూడనిషేధితానిమిత్తేనయను శ్లోకము మొదలుమద్ధర్మణోగుణైశ్శైరను శ్లోకమువరకుకలగ్రంథమందుజెప్పఁబడియున్నది. అదియంతయువ్యర్థమగునుగావున "యోమాంసర్వేషు" అను శ్లోకమేవిధముచేతనుబ్రతిమార్చానిషేధపరముకానేరదు. ఆశ్చర్యశతకీయశాంకరశ్లోకముకూడఁ బ్రతిమార్చానిషేధమును జెప్పదు. శంకరాచార్యులకుఁ బ్రతిమార్చానిషేధమందే తాత్పర్యమున్న మూర్తిప్రతిపాదకములగు స్తోత్రగ్రంథములనేకము లెందుకని చేసియుండురు? స్వకీయభాష్యములలో సాలగ్రామప్రతిమాదిదృష్టాంతముతో నోంకారాద్యుపాసన మెట్లుపపాదించును? కావున వారికిని నధికారిభేదముచే సాకారాద్యుపాసనమును బ్రతిమార్చనాదికమును నిష్టమేయని యెఱుంగునది. శంకరవిజయము పంచమసర్గలో శంకరాచార్యగ్రామనికటవర్తి విష్ణ్వాలయస్థ శిలామయవిగ్రహమును నశరీర వాగాజ్ఞానుసారము మఱియొకచోట శంకరాచార్యులు స్థాపించిరని చెప్పఁబడియున్నది. అచ్చటి యీశ్లోకము చూడుఁడు, ఆకర్ణ్యవాచమితితా మతనుం గురుర్నః ప్రోద్ధృత్యకృష్ణమచలం శనకైర్భుజాభ్యాం ప్రాతిష్ఠయ న్నికట ఏవ నయ త్రబాధా నద్యేత్యుదీర్య సుఖమాప్స్వ చిరాయచేతి॥ అందేదశమసర్గలో సరస్వతినిగూర్చిన

శంకరోక్తి, శ్లో॥ తస్మాదస్మత్కల్పితేష్వర్చమానా స్థానేషుత్వం శారదాఖ్యాదిశంతి ఇష్టానర్థాన్ఋశ్యశృంగాదికేషు క్షేత్రేష్వాస ప్రాప్తసత్సన్నిధానా॥ అనియున్నది. ఇట్లు ద్వాదశసర్గలో గోకర్ణక్షేత్రమునకు వెళ్లి యందున్న యీశ్వరునర్ధనారీశ్వరరూపముని చేస్తుతించెననియున్నది. ఇట్టిప్రమాణము లనేకములు కలవు-ఈగ్రంథము లప్రమాణముల నెడిచో శంకరాచార్యాదిసద్భావమందలిప్రమాణాభావముచే శాస్త్రిగా రుదాహరించిన యాశ్చర్యశతకపుఁగర్తయే లేకపోవుటతటస్థించి యాశ్రయాసిద్ధియే వాటిల్లును-అప్పు డెలుకభయమున కింటికిఁ జిచ్చుపెట్టుకొన్నచంద మయ్యెడిని-కావున మృచ్ఛిలాదారుభ్రాంతయనుశ్లోకము జ్ఞానస్తుతిపరమేకాని ప్రతిమార్చనానిందాపరముకాదు- కనుకనే యందరున్ముఖాః యనియున్నది-ఆ యరున్ముఖశబ్దమునకు వేదాంతవాక్యశూన్యులని యర్థము-కౌశీతికబ్రాహ్మణమందలి "(త్రిశీర్షాణం త్వాష్ట్ర) మహానం, అరున్ముఖాన్ యతీన్ సాలావృకేభ్యః ప్రాయచ్ఛమ్" అనుశ్రుతిలోని యరున్ముఖశబ్దమునకుఁ బ్రతర్దనాధికరణభాష్యటీకయందు "రాతియథార్థం శబ్దయతీతి రుత్, వేదాంతవాక్యం, తత్ ముఖే యేషాం తేఽరున్ముఖాః, తేభ్యోఽన్యాన్ వేదాంతబహిర్ముఖాన్" అని వ్యుత్పత్తి వ్రాయఁబడినది-కావున దచ్ఛ్లోకమున కాచార్యులవారియభిప్రాయము వేదాంతవాక్యార్థవిచారములేక కేవలదేవతార్చనాదులచేఁ బరమపురుషార్థ మెన్నటికింగలుగదని యైయున్నది-అట్లుకానిచో ననేకములగు తత్కృతమూర్తిపూజాప్రతిపాదకగ్రంథములకును గ్వాచిత్కములగు నేతాదృశగ్రంథములకును బరస్పరవిరోధము సంభవించును-తాదృశమహాత్ములకజ్ఞానాదిబహుదోషజాతము కల్పితముకూడనగు- ఒకరుచేసినగ్రంథములోనివి కొన్ని ప్రమాణములనియుఁ గొన్ని యప్రమాణములనియుఁ జెప్పుట యనుచితము- ఇట్లే మహాపండితశిరోమణులును జగద్విఖ్యాతపాండిత్యాది మహామహిమశాలులును నగు నప్పయ్యదీక్షితచరణులచే విష్ణుమహిమప్రతిపాదక వైష్ణవపురాణములకును శివమహిమప్రతిపాదక శైవపురాణములకును నేప్రకార ముపపత్తియగునను శంకవచ్చినప్పుడు

శివాపకర్షప్రతిపాదకపురాణములకు విష్ణూత్కర్షప్రతిపాదనమందే తాత్పర్యముగానిశివనిందయందుఁగాదనియు నిట్లేవిష్ణ్వపకర్షప్రతిపాదకశైవపురాణములకు శివోత్కర్షప్రతిపాదనమందే తాత్పర్యముగాని విష్ణునిందయందుగాదనియుఁ బురాణముల పరస్పరవిరోధము పరిహరింపఁబడియుండెను- అటులఁగానిచో సర్వపురాణకర్త యొక్కఁడేయగుటఁ బరస్పరవిరుద్ధవాక్యప్రయోక్తృత్వము సంభవించును-ఇట్టిరీతినిగాక యెవ్వఁడేని వర్షశతములకైనను బురాణముల పరస్పరవిరోధము పరిహరింపశక్తుఁడు కాఁడు-మఱియు, రేణుకాతంత్రమందలి మాధవాచార్యులఁ గూర్చిన లక్ష్మీవాక్యము,శ్లో॥ శివదేవాలయానాంచ షష్ఠ్యుత్తరశతత్రయం। వేదాగమోక్తమార్గేణ స్థాపకస్యగురోస్తథా॥ భారతీసంప్రదాయజ్ఞ శంకరస్వయతేస్తదా। ఆరాధనంచైత్రమాసే పౌర్ణమ్యాంకార్యమేవహి॥ అనియుండుటంబట్టి యనేకాలయప్రతిష్ఠాతలగు నాచార్యులకు మృచ్ఛిలాదారుభిర్వాంతయనుస్థలమందుఁ బ్రతిమార్చనానిషేధమునఁ దాత్పర్యమని యెట్లు చెప్పనగును-కావున నా శ్లోకము జ్ఞానస్తుతిపరమనుట సిద్ధము-తదుదాహృతశ్లోకద్వయమునకు శాస్త్రిగారిచేఁగూడ దాత్పర్యాంతరము చెప్పఁదగినదే. అట్లుకానిచో బ్రహ్మబంధుప్రముఖులకుఁ బ్రతిమార్చనమంగీకరించెడి శాస్త్రిగారికిఁ గేవలప్రతిమార్చనానిషేధకప్రమాణోదాహరణములు గొంతున కుర్రిపాయములగును- శ్లో॥అష్టాదశపురాణేషు స్మృతిష్వష్టాదశస్వపి మూర్తిపూజాదిమానాని శతశస్సంతి శోలిఖేత్ ॥ తరువాత,

ఇది కర్మయందధికృతులగు నస్వల్పబుద్ధులవిషయముకావున నవామధేయస్మృతులమూలమునఁబ్రాప్తమగు దేవతారాధనరూప పంచప్రాణపూజ యెన్నటికి నొకయాచారమని నిరూపింప నవసరముండదు.

అని శాస్త్రిగారిగ్రంథము కనఁబడుచున్నది. పంచాయతనపూజాప్రతిపాదకమగు ,,నాదిత్యమంబికాంవిష్ణు,, మనుస్మృతికిమాధవీయమందు నామనిర్దేశము చేయకపోవుటఁచే దావన్మాత్రద్రష్టకనామధేయత్వమే సిద్ధమగును. అనేకగ్రంథములుచూచినప్పుడుగాని వానినామ

జెప్పఁబడియున్నది. కన్యావస్థాంతరతీతితరుణీ,, కన్యావస్థను దాటినది. (పురుషసాంగత్యముఁజేయుచున్నదని భావము) ఈభావము యువతీశబ్దముతోఁ దరుణీశబ్దము సమానార్థకమని చెప్పియుండుటచే స్ఫురించుచున్నది. తరుణికిఁ గన్యావస్థను దాటినదానికిఁ బురుషసాంగత్యముఁ జేయుచున్న దానికి) వివాహ మెందులకు?

## యువతీవివాహమనఁదగునా?

గురు, 158పుట ,,పుంసా యాతీతి యువతిః,, పురుషునితోఁ గూడునది. అని వ్యుత్పత్త్యర్థముకలదు. దీనింబట్టి పురుషసంగమముఁజేయుచేడియను యువతియను పేరు వాడవలయునని తెలియవచ్చినది. పురుషునితోఁగూడెడిదానికిఁ బరిణయ మెందులకు? ఈవివాహములను హిందువులలో నికృష్టజాతులలోనివారుకూడ నంగీకరింపరని స్పష్టముగాఁ జెప్పవచ్చును. ఇట్లుండ సర్వలోకపూజ్యులగు మహర్షులగోత్రజులైన బ్రాహ్మణులు ముప్పదిగేండ్లదానివివాహమును, బురుషసాంగత్యముఁజేయుచున్న తరుణీయువతీవివాహములను నెట్లుచేసికొనెదరు? ఒకవేళఁ జేసికొనినఁ వారికిఁబూజ్యతయెక్కడిది? కాన మనసోదరులు తాముపూనినకార్యమునకు శాస్త్రవిహితనామములను బెట్టుకొనఁ జాలనివారని యీవిమర్శవలన ధ్రువపడినది.

## రజస్వలావివాహములు శ్రుతివిహితములా?

రజస్వలావివాహములు శ్రుతివిహితములనిసాధించుటకు సంఘసంస్కారప్రియ పండితులగు కీర్తిశేషులైన పెద్దింటి నరసింహాచార్యులుగారు పాణిగ్రహణకాలమునందు వరుఁడు కన్యతోఁజెప్పెడి యీ,,గృభ్ణామితేసుప్రజాస్త్వాయహస్తం మయాపత్యాజరదష్టిర్యథాసహ,,అను మంత్రమునుగ్రహించి యిందు వరుఁడు కన్యతో నీహస్తము నేనెందులకుఁబట్టుకొనుచున్నాననఁగా మంచిసంతానముకలదాని భావముకలుగుటకొఱకుఁ (బెనిమిటినైననాతో జరావస్థయొక్కప్రాప్తికలదాని వెప్పటికగుదువో యప్పటివఱకు నీహస్తమును నేనుబట్టుకొనుచున్నాను. అనిచెప్పినటున్నది. కాన వివాహము నాఁటికా కన్యకు మంచిసంతానముఁగనఁదగిన యీడువచ్చి(రజస్వలయై)యుండనిచో వరుఁడిట్లు నీకుమంచిసంతానముకలదాని భావముకలుగుటకొఱకు నీపాణిగ్రహణము జేయుచున్నానని చెప్పుట సంభవించునా? సంభవింపదు. కాన వేదకాలమున రజస్వలావివాహములే యుండెడివని వచించియున్నారు. ఇంతకంటెవింతవాదము మఱియొకటియుండునా? ఆమంత్రమునందున్న ,,సుప్రజాస్త్వాయ,, అనుపదముఁబట్టి వివాహమైనతరువాత నీకు మంచిసంతానముకలదానిభావముకలుగుటకొఱకు నీహస్తమునుగ్రహించుచున్నాననివరుఁ

డు వధువుతోఁ జెప్పినట్లెల తలంపరాదు ? అందు రజస్వలయైనదను పదము లేదుకదా. లేనప్పు డదివఱకే రజస్వలయై యపుడు సంతానము కనఁదగిన ప్రాయములో నుండవలెననెడి యర్థ మెట్లువచ్చును ? రజస్వలయను పదము లేకున్నను మే మనుమేయముఁ జేయుదు మందురా? ఈవిధముగా వేదమంత్రములకు నెవరియిష్టము వచ్చిన ట్లర్థము వారు చేయఁబూనినచోఁ బెక్కనర్థములు వాటిల్లును. ఇట్టు మన సోదరు లనుమానముచేతఁ దమయిష్టార్థము సాధింపఁజూచుచున్నారు. కాని యింతకంటె స్పష్టముగా విరుద్ధార్థములుగల మంత్రములు కొన్ని గలవు. వాని కాయర్థములను మనము చెప్పుకొనినయెడల మనకంటె హీనాచార ప్రవర్తకులు వేఱుగా నుండరని విశదమగును. అదేమన ? (1) “ మూర్ధానం పత్యురారోహ ” యని యొక మంత్రవాక్యము కలదు. ఇదియు వరుఁడు వధువుతో వివాహ సమయమునఁ జెప్పునదియు “ పత్యుః—భర్తవైన నాయొక్క మూర్ధానం, శిరస్సును, ఆరోహ, ఎక్కుము, అని దీనియర్థము. దీని నెవఁడైన నంగీకరించి భార్యను దన నెత్తిమీఁద నెక్కించుకొనునా ! ఎక్కించుకొనినవానికంటె నవివేకి యుండునా ! ఉండఁడు. పండితులీయర్థమును జేయఁజాలరు. పైవాక్యమునకు హరదత్తాచార్యు డేమని వ్యాఖ్యానము వ్రాసియున్నాఁడో చూడుఁడు, “పత్యుర్మమ మూర్ధానం ఆరోహ ప్రధానభూతా భవ” భర్తనైన నాకు ప్రధానభూతురాలవుకమ్ము, అని దీనియర్థము. ఇదియేకాదు “పతీనాంచ దేవృణాంచ సజాతానాం విరాడ్భవ” అను మఱియొక మంత్రవాక్యము కలదు ఇదియును వరుఁడు వధువుతోఁ జెప్పునదియు. ఇందు పతీనాం = భర్తలకును దేవృణాంచ = మఱదులకును, సజాతానాం చ = సజాతీయులకును విరాడ్భవ = నీవు రాణివికమ్ము, అని దీనియర్థము సుఖముగా నగుచున్నది. ఈయర్థము నాధారము చేసికొని మఱియొక సంస్కర్తగారు వివాహమంత్రమునందు “నీభర్తలకు నీవు రాణివికమ్ము” అని వరుఁడే వధువుతో జెప్పినట్లు స్పష్టముగాఁ గనుపడుచున్నదికాన వేదకాలమున నొక స్త్రీకి ననేకభర్తలుండెడి యాచారము కలదు, లేకున్న నీమంత్రమునకు వినియోగమేమి ! దీనికి నిదర్శనము., పంచమ వేదమని ప్రసిద్ధిచెందిన శ్రీమహాభారతమందు ద్రౌపది యైదుగురు భర్తలను వివాహమాడినట్లు కలదు. అదిగాక యామె పతివ్రతలైన యహల్య తార మొదలగు నైదుగురిలో రెండవ పతివ్రతగా బరిగణింపఁబడినది. కాన స్త్రీలకు బహుపతిత్వము సిద్ధించుచున్నది. దీని నాచారములోనికి దెచ్చుకొనినయెడల సువిదలకు విధవాత్వము లేకుండఁజేయఁగలుగుదుమని బయలుదేరుదురు, దీనిని మన మంగీకరింపవలసినదేనా ! అంగీకరింపకున్న మన సోదరులు నీతిలేని శుంఠలారా ! ద్విపాదపశువులారా లోనగు సంబోధనతో వ్యాసములు వ్రాసి ప్రకటనార్థమై పత్రికల కంపుచుందురు. వానినిఁ బత్రికాధిప

తులు బహుపలుచుమఁ బత్రికలలోఁ బ్రకటించుచుందురు. వానికిఁ దగిన ప్రత్యుత్తరములు వ్రాసిపంపిన నాపత్రికాధిపతులు "ఫలాని, ఫలాని" వారి వ్యాసములు ప్రకటింపలేని వ్రాయవలసివచ్చినందులకుఁ జాలఁజింతిల్లుచున్నారమని యొగనామమును బెట్టుచుందురు. ఆవెంటనె "బహుపతిత్వశాసనము" స్థాపింపఁదలచి "అకార్డింగ్ టుది హిందూశాస్త్రాస్" అని గౌరవనీయులు గొప్పగ్రంథములువ్రాయ మొదలుపెట్టుదురు. వీరికేమి, సంస్కృతభాషా పండితులుమాత్రము పైమంత్రమునుబట్టి స్త్రీలకు బహుపతిత్వము సాధింపఁదలఁపరు. చూడుఁడు హారదత్తవిబుధుఁ డిట్లు వ్యాఖ్యానముఁజేసియున్నాఁడు. "పతీనాంచ- పత్యుర్మ్నము, మహ్యానీయానాంచ దేవృాణాంచ దేవరాణాంచ.........విరాట్, ఈశ్వరాభవ" అనఁగా "పతీనాం" అను బహువచనపదమునకు భర్తలనయినవారు రాణివికమ్మని యేకవచనార్థమును వ్రాసియున్నారు. పండితులిట్లర్థముచేయక; స్త్రీల కనేకభర్తలుండవచ్చునని వ్రాయుదురా? వ్రాయరు. కాఁబట్టి మనయాచార్యులవారు మంత్రమందులేని యర్థమును దామూహించివ్రాయుట సహంజసము గాలేదని దీనివలనఁ దెలినది. ఈనడుమ 6-2-15 తేదిగల యాంధ్రదినపత్రికయందు శ్రీయుత బైసాని నరసింహేశ్వరగుప్తగారు రజస్వలావివాహములకు వేదమూ లంగీకరించుచున్నవని తెలుపుటకు గాను,

మూఁడువర్ణముల వారిచేతను వివాహకాలములోఁ బఠింపఁబడు మంత్రములలోని "సోమః ప్రథమో వివిదే, గంధర్వో వివిద ఉత్తరః తృతీయో అగ్నిష్టేపతి స్తురీయ స్తే మనుష్యజాః" అను ఋగ్వేదవచనమునుబట్టి చూడఁగా మొదట సోముఁడును, పిమ్మట గంధర్వుఁడును. దరువాత అగ్నియు, వరుసగా వరింతురనియు అటుపిమ్మట మనుష్యులు వరింతురనియు నున్నది. మరియు వివాహమునకుముందు సోమాదులువరించెడి కాలమేదనఁగా "రోమకాలేతుసంప్రాప్తే సోమోభుంక్తేథకన్యకాం, రజోదృష్ట్వాతుగంధర్వః కుచౌదృష్ట్వాతు పావకః" అనఁగా రోమదర్శనకాలమందు సోముఁడును, రజోదర్శనకాలమందు గంధర్వుఁడును, కుచదర్శనకాలమం దగ్నియును, వరింతురనియు పిమ్మట అనగా కన్నియ రజస్వలయై కుచపూర్తియైనపిమ్మట పురుషుఁడు వివాహమాడవలెనని సంవర్తస్మృతియందు జెప్పఁబడినది.

అని సెలవిచ్చియున్నారు. ఈయర్థము సామాన్యబుద్ధితోఁ జదువువారికి విహితముగాఁ దోఁచినను సవిమర్శముగాఁ బఠించువారికి దోషదూషితముగాఁ దోఁపకపోదు. అదేమన? "సోమః ప్రథమోవివిదే" యను మంత్రము యొక్క యర్థవినియోగమునకు సమయము వివాహానంతరమునుగా సంవర్తుఁడు తలంచి "రోమకాలేతుసంప్రాప్తే" యను శ్లోకమును రచించినాఁడు కాని వివాహమునకుఁబూర్వమునందామంత్రార్థమునకు వినియోగముగాఁదలంచి యీ శ్లోకమును రచించియుండలేదు. మనగుప్తగారు రోమదర్శనకాలమున సోముఁడును, రజోదర్శనకాలమున గంధర్వుఁడును కుచదర్శనకాలమునందగ్నియును వరింతురనియు నావల ననఁగాఁగన్నియ రజస్వలయై కుచపూర్తియైనపిమ్మట బురుషుఁడు వివాహమాడవలెనని సంవర్తస్మృతియందుఁ జెప్పఁబడియున్నదని వ్రాసియుండిరికదా అటులేని నావెంటనెయున్నశ్లోకము, రజస్వలానంతరమునఁగన్యను బురుషుఁడువివాహమాడవలసినదని చెప్పవలయునుగదా, ఏమని చెప్పుచున్నదో చూడుఁడు. "అష్టవర్షా భవేద్గౌరీ, నవవర్షాతు రోహిణీ, దశవర్షా భవేత్కన్యా అతఊర్ధ్వం రజస్వలా,, మాతాచైవ పితాచైవ జ్యేష్ఠో భ్రాతాతథైవచ త్రయస్తేనరకంయాంతి దృష్ట్వాకన్యాం రజస్వలాం, తస్మాదుద్వాహయేత్కన్యాం యావన్నర్తుమతీభవేత్,,అనఁగా నెనిమిదేండ్లదిగౌరి తొమ్మిదేండ్లపిల్ల రోహిణి, పదేండ్లబాలిక కన్యయటుపిమ్మట రజస్వల,తల్లి, తండ్రి పెద్దన్న లోనగువా వివాహమునకుఁబూర్వము రజస్వలయైనకన్యను జూచి నరకమునుబొందుచున్నారని దీనియర్థము. "రోమకాలేతుసంప్రాప్తే,, యనుశ్లోకముతో రజస్వలకు వివాహముచేయుమనిచెప్పిన సంవర్తుఁడు తరువాతిశ్లోకములతో నెనిమిదితొమ్మిది పదేండ్లప్రాయములోనున్న కన్యకకువివాహముచేయువలసినదనియుఁ బిదప రజస్వలయనియు వివాహమునకుముందు రజస్వలయైనకన్యనుగనిన తండ్రి మొదలగుదాతలు నరకమునుబొందుదురనియు నెట్లుచెప్పును? ఇంతియకాదు వివాహో హ్యష్టవర్షాయాః కన్యాయాస్తుప్రశస్యతే అనఁగా నెనిమిదేండ్లకన్యకకు వివాహముచేయుటయె ప్రశస్తమైనదియని యెట్లుచెప్పును. చెప్పఁడు. మన సోదరులగుగుప్తగారు "రోమకాలేతుసంప్రాప్తే"యనుశ్లోకమునందున్న రోమరజఃకుచములదర్శనలాభమునఁ దమ కాంక్షితార్థసిద్ధియగునని యెంతో యాపేక్షపడిరికాని యీవెంటనెయున్న శ్లోకములలోని రజస్వలావివాహనిషేధమును, అష్టవర్ష బాలికావివాహప్రాశస్త్యమును వారియాపేక్షనంతయు మంటఁగల్పినవి. ఇట్లుండఁగా గుప్తగారు "ఆవల అనగా కన్నియ రజస్వలయై కుచపూర్తియైనపిమ్మటఁ బురుషుఁడు వివాహమాడవలెనని సంవర్తస్మృతియందుఁజెప్పఁబడియున్న"దనివ్రాసియున్నారు. ఈవాక్య

మునకు మూలము నిర్మూలము. లేకున్న మనగుప్తగారు తమయర్థము సార్థకముఁ జేసికొనుట కు నూత్నవచనమును గల్పించి గ్రంథమునం దెక్కింపవలయును - ఇంతకుదిగినవార లంతకువె అతురా? వెఱవరు కాని యవి ముద్రితములై జగద్వ్యాప్తిని జెందియున్న వికాన వీరికోరిక నెరవేరదని చెప్పనగును. ఇట్లనఁగా నే యీ “రోమకాలే తు, సంప్రాప్తే” యను శ్లోకమున “రోమదర్శనకాలమునఁ జంద్రుఁడును రజోదర్శన కాలమున గంధర్వుఁడును గుచదర్శనకాలమున నగ్నియు వరింతుర”నియున్నది. తరువాత (రజస్వలయైన తరువాత) మనుష్యుఁడు వివాహమాడుననువాక్యము లేదనికదా మీయా క్షేపము. ఈవాక్యలోపము “సోమః ప్రథమో వివిదే” యనుమంత్రములోఁ జెపఁగను న్న “ తురీయస్తే మనుష్యజాః ” అనువాక్యము ననుసంధించుకొని యాశ్లోకమువన్వ యించినయెడల నది తీరుచున్నదని గుప్తగారుచెప్పవత్తురేమో ? ఇంత క్లిష్టాన్వయము” జేసికొనినను వారికోరికఫలించునట్లు తోఁపదు. అదేమన — ఈశ్లోకమునల దురోమ రజః కుచదర్శనకాలములందు సోమగంధర్వాగ్నులు “భుంక్తే„ అనుభవించుచున్నారు, అని యున్నదికాని వరింతురనుక్రియ నగనారవిందముని తలంపవలెను. కావున మనగుప్తగారీవ చనములతో రజస్వలానంతరవివాహమును సాధింపఁబోవుట సహృదయవిషాదకరముగా నున్నదని చెప్పవలసివచ్చినందులకుఁ జింతిల్లుచున్నాము. ఈవిమర్శవలనఁ దేలిన సార మేమనఁగా వివాహానంతరమందు సోమగంధర్వాగ్నులు రోమరజఃకుచదర్శనకాలము లం దాస్త్రీని ననుభవింతురనియు స్త్రీకి రోమరజఃకుచోత్పత్త్యవస్థలఁ గలిగింతురనియుఁ బిదప మనుష్యుఁడనుభవించుటకు నాతరుణి తగినదనియుభావము - ఇట్లు విన్నవింపగానె మనగుప్తగారు “సోమః ప్రథమో వివిదే ”యనుమంత్రము వెంటనే “ సోమోదదద్గంధ ర్వాయ గంధర్వోదదదగ్నయే రయించ పుత్రాగుంశ్చాదా దగ్నిర్మహ్య మథోఇమాం” అనఁగా సోముఁడు గంధర్వునకిచ్చెను. గంధర్వుఁడగ్నికొసఁగెను, అగ్ని నాకుఁగన్యను దానముచేసెను” అని స్వచ్ఛముగాఁ దన కగ్నిహోతృ౧ఁడు వివాహముఁ జేసికొనుటకుఁ గన్యనిచ్చినాఁడని వరుఁడు చెప్పియుండఁగా వివాహానంతరమునఁ గన్యకకు సోమగంధ ర్వాగ్నులు రోమరజఃకుచోత్పత్త్యవస్థలం గలిగించి మనుష్యుఁ డుపభోగించుటకు నొ సంగుదురనెడిభావ మెక్కడనుండివచ్చునని మరలమనల డీకొనకమానరు. అప్పుడును నా మంత్రము వివాహసమయములో వధువునుగూర్చి వరునిచేఁ జెప్పఁబడునదైనను నా మం త్రార్థమునకుఁగూడ వినియోగము వివాహానంతరమందనియే విజ్ఞాపనఁజేసికొనుచున్నా ము - అట్లుకాదని మనగుప్తగారు పట్టుఁబట్టెదరేని వారియిష్టానుసార మామంత్రార్థము నకు వినియోగము వివాహమునకుఁబూర్వమం దంగీకరించినయెడల మహానర్థములు కలు

గును-వానిని విన్నవించినతోడనే శ్రీగుప్తగారు వివాహమునకుఁబరమందె "సోమోద దద్గంధర్వాయ" అను మంత్రముయొక్క యర్థమునకు వినియోగమని తప్పక యంగీకరించితీరుదురు. అదేమనఁ? "సోమోదదద్గంధర్వాయ-సోముఁడు కన్యను గంధర్వునకిచ్చెను. గంధర్వోదదదగ్నయే గంధర్వుఁడాకన్యను వీతిహోత్రునకొసఁగెను-రయించపుత్రాగ్ంశ్చాదా దగ్నిర్మహ్య మథోఇమాం" వీతిహోత్రుఁడు ధనమును, పుత్రులను (ముగ్గురికిఁ దక్కవకాని వారిని) కన్యవైననిన్నును నాకిచ్చెను" అని మంత్రార్థము కదా. ఈమంత్రార్థమునకు వినియోగము వివాహమునకు ముందని పట్టుఁబట్టినారు. ఈపట్టునవిడువఁడని యెన్నిమాఱులు బ్రతిమాలినను వినలేదు. వీరియర్థమునకనుసరించి వివాహమాడిన వరునికంటె నదృష్టవంతుఁడు ప్రపంచమున మఱియొకఁడుండఁడు. అదేమందురా! తనను వివాహమాడుటకుముందాకన్య ధనమునార్జించి వివాహమాడుచున్నది. దీనివలన నతనిజీవితాంతమువఱకు ధనార్జనకయి శ్రమపడవలసినపనిలేదు కష్టపడి పుత్రులను గనవలసినయవసరమును గానరాదు. అదేమన? వివాహమునకు ముందె ముగ్గురికిఁదక్కవకాని కొమారులను గని యాతని వివాహమాడియున్నదికాఁబట్టి యాశ్రమయులేదు, ఓహో! ఏమి! ఈవరుని యదృష్టము! పెండ్లియైనదినమునానె యిరుప్రక్కల నిరువురుపుత్రులను, నెదపై నొకపుత్రునిఁ బండవేసికొని

"విపరీతప్రతిభాషలేమిటికి సుర్వీనాథ! యీ పుత్రగా
త్రపరిష్వంగసుఖంబు సేకొనుము ముక్తాహార కర్పూరగ సాం
ద్రపరాగప్రసరంబుఁ జందనము, చంద్రజ్యోత్స్నయుఁ బుత్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడుఁశీతమే॥

అను భారతములోని పద్యమును బఠించుచు హాయిగా సుఖపడును. ఈయర్థమును మన యనుజులంగీకరింతురా! అంగీకరింపరు. అప్పుడీ మంత్రార్థమునకు (ధనము నార్జించుటకు పుత్రులను గనుటకు) వినియోగ మెప్పుడనిచెప్పుదురు? వివాహానంతరమందని శ్రీగుప్తగారు సమ్మతింపకపోరు. అటులేని మీరుచెప్పిన రజస్వలావివాహవాదము మీసమ్మతిమీఁదనె శ్రుతిస్మృతివిరుద్ధమని తేలినదని మనమువిన్నవింపవచ్చును. వీరు "అపశ్యంత్వా" అను మఱిరెండుమంత్రముల కర్థము వ్రాసి వానింబట్టియు రజస్వలావివాహములు సిద్ధపడుచున్నవని వాకొనియున్నారు. వానింగూర్చి "రజస్వలావివాహములు సూత్రానురోధములా" యను శీర్షికక్రింద విమర్శించియున్నాము కాన నటఁ జదువఁగలరు. ఇంతియకాదు మనసహోదరు లింతకంటె మఱికొన్ని మంత్రములనుగైకొని వానితో రజస్వలావివాహముల స్థాపింపఁజూచుచున్నారు. వానిం

గూర్చి యించుక ముచ్చటించుకొందము. అవేమన — వివాహము చేసికొనఁదలఁచిన పురుషుఁడు కన్నెయున్న యెడకుంబోయి యామెకుఁ గుచములువచ్చినవా? మర్మస్థానములందు రోమములు మొలచినవా? లేదాయని స్వయముగాఁ బరీక్షించి యవివచ్చియుండినచో నాకన్యను వివాహమాడవలెనని వివాహమంత్రములు చెప్పుచున్నవని సెలవిచ్చుచున్నవా? కాన వాని వరుసగా విమర్శించుకొందము. వివాహములో "ద్యౌస్తే పృష్ఠగుం రక్షతు, వాయు రూరూ, అశ్వినౌచ స్తనం" నీపృష్ఠభాగమును స్వర్గము రక్షించుగాక, నీతొడలను వాయువు రక్షించుగాక, అశ్వినీదేవతలు నీస్తనములను రక్షించుగాక, యని వరుఁడు వధువును గూర్చి చెప్పుచున్నాఁడు. కానఁ బూర్వకాలమున స్తనములువచ్చియున్న బాలికను వివాహమాడెడి యాచారము లేనియెడల "నీ స్తనములను నశ్వినీదేవతలు రక్షించుగాక" యని యెట్లు చెప్పును? చెప్పఁడు. కాన వేదకాలమున రజస్వలావివాహములె యుండెనని వాదించుచున్నారు. ఇదేమిచిత్రము. వివాహములో వరుఁడు కన్యనుగూర్చి "నీ స్తనముల నశ్వినీదేవతలు రక్షించుగాక" యని చెప్పినంతమాత్రమున వివాహము నాఁటికే స్తనములువచ్చియుండవలెనని చెప్పుట యెందులకు? అది వివాహమునకుఁ బరమునని చెప్పఁగూడదా? ఆ స్తనములు స్థౌల్యముఁ జెందినగాని చెప్పకూడదను నియమము కలదా? ఆ యవయవములకు స్తనములను నామము పుట్టిననాఁటగోలె వ్యవహరింపఁబడుచున్నది. అవి పురుషులకును గలవు. కాన "నీ స్తనములను రక్షించుగాక" యను వ్యవహారము వివాహమునకుఁ బూర్వమునను బరమునను గూడఁ జెల్లఁదగియున్నది. "కాదుకూడదు. మేము చెప్పినయట్లు వివాహమునకుఁ బూర్వమే కుచములువచ్చియుండి వానినిఁ జూచి యావధువును బరిణయము కావలసిన"దని యందురా? ఇదియు వెనుకటిమంత్రార్థమువలెనే విరుద్ధఫలము నిచ్చును. చూడుఁడు. "ద్యౌస్తే పృష్ఠగుం రక్షతు, వాయు రూరూ, అశ్వినౌచ స్తనం, ధయంతగ్ం సవితాభిరక్షతు, అనఁగా నీపృష్ఠభాగమును స్వర్గమును, వాయువు నీ యూరువులను, నీకుచములను నశ్వినీదేవతలును రక్షించుదురుగాక యని చెప్పి వెంటనే "ధయంతగ్ం సవితాభిరక్షతు" నీ పాలుఁద్రాఁగెడుపుత్రుని సూర్యుఁడు రక్షించుగాక యని వరుఁడు చెప్పుచున్నాఁడు. వివాహమునకుముందే యీమంత్రార్థమునకు వినియోగమగునెడల నప్పటికేఁ బాలుఁద్రాఁగెడి బాలుఁడుదయించియుండవలెనని చెప్పితీరవలయును లేనియెడ నీ పాలుఁద్రాగెడిపిల్లవానిని సూర్యుఁడు రక్షించుగాకయని పతి సతితో నెట్లు చెప్పును? ఈయర్థమును మీ రంగీకరింతురా యని మన ప్రతివాదసోదరుల నడిగిన వివాహానంతరము బాలుఁ డుదయింపగా వానిని సూర్యుఁడు రక్షించుగాకయని వరుఁడు చెప్పిన ట్లన్వయింతురు? అటులేని మీ రామంత్రార్థమునకు వినియోగము వివాహానంతరము

నందే యని సమ్మతించుచున్నారు గాన మీవాదమునకు మూలచ్ఛేదము మీరే చేయుచున్నారని విన్నవించుకొందము. ఇదియిట్లుండనిండు. మనసోదరు లెంతకైనఁ దెగించుచున్నారు. వివాహమంత్రములలో నీ స్తనములను వశ్వినీదేవతలు రక్షించుగాక యని చెప్పినట్లున్నంతమాత్రముననే స్తనములఁ జూచి వివాహమాడవలెననియు «శమోధో రోమశగంహాథో దేవేషు కృణుతోదువః» అను మంత్రమునందు రోమములు వచ్చిన మర్మస్థానము గలపడుచు భోగార్హురాలనియున్నకాన రోమములు వచ్చినసంగతినిజూచి యాకన్యనే వివాహమాడవలెననియు, వాదించుచున్నారు. అయ్యో, ఇది యెక్కడివిపరీతవాదము. రజస్వలమాట యటుంచి ఎనిమిదేండ్లపిల్లయైనను వరునిమాట నటుంచి తనతండ్రి యన్న తమ్ముఁడు లోనగువారియెదుట వస్త్రమును విడువదు సరికదా. ; రవికెనుగూడ విడిచినట్లు మనము కనివినియుండలేదు. ఇట్లుండగా రజస్వలయై స్తనములు రోమములు వచ్చియున్నపడుచు దనను వివాహమాడుటకువచ్చినవరునకు సిగ్గులోపాటు చీరను, రవికెనుగూడ విడిచి నాగోప్యావయవములఁ జూచికొని వానియభివృద్ధి నీకు నచ్చినయెడల వివాహమాడుము. లేకున్న నీయబ్బవంటివాఁడు మఱియొకఁడువచ్చునని చూపించునా? చూపింపకేమి. ఇదికలికాలముకాదా! ఈకోరిక మనసునందిడుకొనియే కాబోలు స్త్రీలకు స్వయంవరవివాహము లభిలషించుచున్నట్లు తోఁచుచున్నది. వాదమునిమిత్తము మనసోదరులుకోరినప్రకారము కన్యలు తమగోప్యావయవములను వివాహమాడవచ్చిన వరునకుఁ జూపించిరనుకొందము. అయినను నామంత్రమునందు నశ్వినీదేవతలు నీస్తనములరక్షించుగాకయని కలదుకాని స్తనములనుజూచి వివాహమాడవలెననుమాట లేదు. ఇఁక «శమోధో రోమశగంహాథో» యనుమంత్రము వివాహమంత్రములలోనిదని చెప్పిరి. కాని యదితప్పు. ఆమంత్రము గర్భాధానఖండములోనిది. ఆమంత్రమునందు స్త్రీయొక్క యూధస్థానము(ఉపస్థేంద్రియము)నందు రోమములు మొలిచినంగాని యాపడుచు నుపభోగార్హురాలు కాదని చెప్పఁబడియున్నది. ఈమంత్రమునకు హరదత్తాచార్యుఁ డిట్లు భాష్యముఁ జేసియున్నాడు? ఊధః ఊధస్థానీయం ఉభయో రుపస్థేంద్రియం రోమశం, అనేన ఉపభోగయోగ్యతా లక్ష్యతే. రోమోత్పత్తేః ప్రాగనుభాగ్యాహి స్త్రియః,, ఉభయుల యుపస్థేంద్రియము రోమశ్లిష్టము గావలెను, ఇందువలన నుపభోగయోగ్యత కనుపడుచున్నది- రోమోత్పత్తికిఁ బూర్వము స్త్రీలుపభోగార్హులు కారుకదా, అని దీనియర్థము. ఈమంత్రము చెప్పినట్లు గర్భాధానముఁ జేసికొనవలసిన వధూవరులు రోమములువచ్చినతరువాత భోగించుట కర్హులని తెలుచున్నది. దాని నెవరుకాదనిరి! ఈవిధముగా మంత్రములకు విరుద్ధార్థములను జేసి తమయిష్టమువచ్చిన సంస్కరణములను జేయఁజూచుచు

## ప్రధాన పోషకులు.

1. శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.
2. శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహాదరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

## సహాయులు.

14. శాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట
15. తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజర్లపాడు.
16. వెలగూరి పిచ్చయ్యగారు, కొండముగుండ్ల.
17. తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
18. గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కాట్బ్రదర్సుకంపెనీ
19. వేమువళ్ళ గోపాలరావుగారు, కరణం, అనుదీపురం
20. ఉల్లగంటి వీరరాఘవరావుగారు, మక్తాదారు, ఆనేపురం.

# ఈనెల సొమ్ముచెల్లించిన చందాదారులు.

1. శ్రీగిరిరాజు రాఘవయ్యగారు, గుండ్లపల్లి.
2. అక్కిరాజు లక్ష్మీనారాయణగారు, కరణం గుత్తికొండ.
3. ధారా మార్కండేయశాస్త్రిగారు, వంగిపురాలు.
4. కాజేపల్లి పూర్ణయ్యగారు హెడ్డకౌంటు, నర్సారావుపేట.
5. పిల్లలమఱ్ఱి సోమయాజులుగారు తహశీల్దారు, నర్సారావుపేట.
6. మద్దులపల్లి గురుబ్రహ్మంగారు తాలూకాక్లార్కు, నర్సారావుపేట.
7. ప్రయాగ చంద్రిమౌళిగారు, గుంటూరు
8. రాచకొండ శివన్నసోమయాజులు గారు, చమళ్ళమూడి.
9. గుమ్మడి వెంకటప్పయ్యగారు, చింతపల్లిపాడు
10. రాచకొండ యజ్ఞనారాయణగారు కరణం, గారపాడు.

# అభినవసరస్వతి

పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి

ఇదియొక మాసపత్రిక - ఇందు ప్రాచీనకవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపఁబడును ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలనఁగలుగు నానందము గాక చందాదారులకు 2-3 అపూర్వగ్రంథము లలవడును చందాసంవత్సరమునకు రు 2-0-0

## ఈకార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు

| | | |
|---|---|---|
| 1 | ఆళ్వయాచార్యవిజయము | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరె వీరభద్రకవి) | 0-4-0 |
| 3 | వాసంతికాపరిణయము } ఇవి రెండు నాటకములు | 0-4-0 |
| 4 | కంసవధము | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి ( సింహాద్రి వెంకటాచార్యులు ) | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | 0-2-0 |
| 7 | నీతిగీతులు ( సుమతి శతకమునకు సంస్కృతము ) | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0-2-0 |
| 9 | అత్యద్భుతవిమర్శనము (మం॥ కృష్ణద్వైపాయనాచార్యులు వెంకటరామకృష్ణకవులయవధానములపైవిమర్శనము) | 0-5-0 |
| 10 | చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము ( పత్రికాధిపతి ) | 0-4-0 |
| 11 | సంగదోషము ( సంగదోషముఁ జెఁబట్టుదలవదలని యోగుల చరిత్రదెలుపు నొకచిన్న పద్యరూపమగు కథ | 0-3-0 |
| 12 | వీరభాగవతము ( ముదిగొండ వీరభద్రకవి ) | 1-4-0 |
| 13 | పులిందావివాహము ( పత్రికాధిపతి) | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము | 0-4-0 |
| 15 | శివానందలహరి. ( తంగెడ రామకృష్ణకవి ) | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము( రాయసము వెంకటపతి ) | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము ( తిరుపతివెంకటీయము ) | 0-3-0 |
| 18 | పశ్యాంపుశ్యాం ,, | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము ,, | 0-2-0 |
| 20 | వేమవరాగ్రహార శతావధానము ,, | 0-12-0 |
| 21 | పురశ్చరణము ,, | 0-2-0 |

వలయువారలు సొమ్ముపంపిగాని, వి పి. ద్వారాగాఁగాని, ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు, పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా